# అథ వింశో%ధ్యాయః

# హనుమచ్చరిత్ర

నందీశ్వర ఉవాచ ।

అతః పరం శృణు ప్రీత్యా హనుమచ్చరితం మునే । యథా చకారాశు హరో లీలాస్తద్రూపతో వరాః ॥ 1

చకార సుహితం ప్రీత్యా రామస్య పరమేశ్వరః । తత్సర్వం చరితం విప్ర శృణు సర్వసుఖావహమ్ ॥ 2

ఏకస్మిన్ సమయే శంభురద్భుతోతికరః ప్రభుః । దదర్శ మోహినీరూపం విష్ణోస్స హి వసద్గుణః ॥ 3

చక్రే స్వం క్షుభితం శంభుః కామబాణ హతో యథా । స్వం వీర్యం పాతయామాస రామకార్యార్థమీశ్వరః ॥ 4

తద్వీర్యం స్థాపయామాసుః పత్రే సప్తర్షయశ్చ తే । ప్రేరితా మనసా తేన రామ కార్యార్థ మాదరాత్ ॥ 5

తైర్గౌతమసుతాయాం తద్వీర్యం శంభోర్మహర్షి భిః । కర్ణద్వారా తథాంజన్యాం రామకార్యార్థ మాహితమ్ ॥ 6

తతశ్చ సమయే తస్మాద్ధ నూమానితి నామభాక్ । శంభుర్జజ్ఞే కపితనుర్మహా బలపరాక్రమః ॥ 7

హనూమాన్ స కపీశానశ్శిశురేవ మహాబలః । రవిబింబం బభక్షాశు జ్ఞాత్వా లఘుఫలం ప్రగే ॥ 8

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ! దీని తరువాత నీవు హనుమచ్చరితమును ప్రీతితో వినుము. శివుడు హనుమద్రూపమును దాల్చి గొప్ప లీలలను ప్రకటించిన తీరును తెలుసుకొనుము (1). ఆ పరమేశ్వరుడు ప్రేమతో శ్రీరామునకు గొప్ప హితమును చేసెను. ఓ విప్రా!

సర్వ్వులకు సుఖమును కలిగించు ఆ వృత్తాంతమునంతనూ వినుము (2). ఒకానొక సమయములో అద్భుతమగు లీలలను నెరపువాడు, సకలగుణాభిరాముడు అగు శంకరప్రభుడు విష్ణువు యొక్క మోహినీ రూపమును గాంచెను (3). ఈశ్వరుడగు శంభుడు తన అంతఃకరణమును కాముని బాణములచే కొట్టబడినదా యన్నట్లు చేసి రామకార్యము కొరకై తన వీర్యమును స్ఖలనము చేసెను (4). సప్తర్షులు ఆ శివుని చేత హృదయమునందు ప్రేరేపించబడినవారై రామకార్యము కొరకు ఆ వీర్యమును సాదరముగా పత్రమునందు స్థాపించిరి (5). ఆ మహర్షులు రామకార్యముకొరకై శంభుని ఆ వీర్యమును గౌతముని కుమార్తెయగు అంజనీదేవియందు చెవిద్వారా ప్రవేశ##పెట్టిరి. (6). తరువాత కొంతకాలమునకు శంభుడు ఆ వీర్యము వలన వానర దేహము గలవాడై జన్మించెను. మహాబలపరాక్రమములు గల ఆ వానరునకు హనుమాన్ అను పేరు కలిగెను (7). మహాబలుడు, కపిశ్రేష్ఠుడు అగు ఆ హనుమంతుడు బాలుడుగ నుండగనే సూర్యోదయకాలములో సూర్యుని పండు అని తలపోసి వేగమే తేలికగా ఆ సూర్య బింబమును భక్షించెను (8).

దేవప్రార్థనయా తం సో%త్యజత్ జ్ఞాత్వా మహాబలమ్ | శివావతారం చ ప్రాప వరాన్ దత్తాన్ సురర్షిభిః || 9

స్వజనన్యంతికం ప్రాగాదథ సో%తి ప్రహర్షితః | హనూమాన్ సర్వమాచఖ్యౌ తస్మై#్య తద్వృత్త మాదరాత్ || 10

తదాజ్ఞయా తతో ధీరస్సర్వవిద్యామయత్నతః | సూర్యాత్పపాఠ స కపిర్గత్వా నిత్యం తదంతికమ్ || 11

సూర్యాజ్ఞయా తదంశస్య సుగ్రీవస్యాంతికం య¸° | మాతురాజ్ఞామనుప్రాప్య రుద్రాంశః కపిసత్తమః || 12

జేష్ఠభ్రాత్రా వాలినా హి స్వస్త్రీ భోక్త్రా తిరస్కృతః | ఋష్యమూకగిరౌ తేన న్యవసత్స హ నూమతా || 13

తతో%భూత్స సుకంఠస్య మంత్రీ కపివరస్సుధీః | సర్వథా సుహితం చక్రే సుగ్రీవస్య హరాంశజః || 14

తత్రా గతేన సభ్రాత్రా హృతభార్యేణ దుఃఖినా | కారయామాస రామేణ తస్య సఖ్యం సుఖావహమ్ || 15

ఘాతయామాస రామశ్చ వాలినం కపికుంజరమ్ | భ్రాతృపత్న్యాశ్చ భోక్తారం పాపినం వీరమానినమ్ || 16

మహాబలశాలి, శివావతారము అని యెరింగి దేవతలు ప్రార్థించగా, ఆతడు సూర్యుని విడిచిపెట్టి దేవతలనుండి, ఋషులనుండి వరములను పొందెను (9). అపుడు హనుమంతుడు మిక్కిలి ఆనందముతో తన తల్లి వద్దకు వెళ్ళి ఆ వృత్తాంతమునంతనూ శ్రద్ధతో ఆమెకు విన్నవించెను (10). ధీరుడగు ఆ వానరుడు తరువాత తల్లి యానతిని పొంది ప్రతిదినము సూర్యుని వద్దకు వెళ్లి ఆయన వద్ద విద్యలనన్నిటినీ తేలికగా అభ్యసించెను (11). రుద్రాంశసంభూతుడగు ఆ వానరవీరుడు తల్లియాజ్ఞను పొంది సూర్యుని ఆజ్ఞచే సూర్యుని అంశతో జన్మించిన సుగ్రీవుని వద్దకు వెళ్లెను (12). సుగ్రీవుని అన్నయగు వాలి తమ్ముని భార్యను అపహరించి ఆతనిని తరిమివేసెను. ఆ సుగ్రీవుడు హనుమంతునితో గూడి ఋష్యమూక పర్వతమునందు నివసించెను (13). బుద్ధిశాలి, శివుని అంశతో జన్మించిన వాడు అగు ఆ వానరశ్రేష్ఠుడు తరువాత సుగ్రీవునకు మంత్రియై ఆయనకు అన్ని విధములుగా హితమును చేగూర్చెను (14). భార్య అపహరింపబడగా దుఃఖిస్తూ సోదరునితో కలిసి అచటకు వచ్చిన రామునితో హనుమంతుడు సుగ్రీవునకు సఖ్యమును చేయించెను. దాని వలన సుగ్రీవునకు సుఖము లభించెను (15). వానరవీరుడు, సోదరుని భార్యను అపహరించినవాడు, పాపి, వీరుడననే గర్వము గలవాడు అగు వాలిని రాముడు సంహరించెను (16).

తతో రామాజ్ఞయా తాత హనూమాన్ వానరేశ్వరః | స సీతాన్వేషణం చక్రే బహుభిర్వానరైః సుధీః || 17

జ్ఞాత్వా లంకాగతాం సీతాం గతస్తత్ర కపీశ్వరః | ద్రుతముల్లంఘ్య సింధుం తమనిస్తీర్యం పరైస్స వై || 18

చక్రే%ద్భుత చరిత్రం స తత్ర విక్రమ సంయుతమ్ | అభిజ్ఞానం దదౌ ప్రీత్యా సీతాయై స్వప్రభోర్వరమ్ || 19

సీతా శోకం జహారాశు స వీరః కపినాయకః | శ్రావయిత్వా రామవృత్తం తత్ర్పాణావన కారకమ్ || 20

తదభిజ్ఞానమాదాయ నివృత్తో రామసన్నిధమ్ | రావణోద్యాన మాహత్య జఘాన బహురాక్షసాన్ || 21

తదైవ రావణసుతం హత్వా సబహు రాక్షసమ్ | స మహోపద్రవం చక్రే మహోతిస్తత్ర నిర్భయః || 22

యదా దగ్ధో రావణ    నావగుంఠ్య వసనాని చ | తైలాభ్యక్తాని సుదృఢం మహాబలవతా మునే || 23

ఉత్ప్లుత్యోత్ప్లుత్యచ తదా మహాదేవాంశజః కపిః | దదాహ లంకాం నిఖిలాం కృత్వా వ్యాజం తమేవ హి || 24

వత్సా ! అపుడు వానరశ్రేష్ఠుడు, బుద్ధిశాలియగు ఆ హనుమంతుడు అనేకవానరులతో గూడి రాముని యాజ్ఞచే సీతను వెదుకనారంభించెను (17). ఆ వానరవీరుడు లంకయందు సీత గలదని యెరింగి ఇతరులకు లంఘింప శక్యము కాని సముద్రమును శీఘ్రముగా లంఘించి లంకను చేరెను (18). ఆతడచట పరాక్రమముతో నిండియున్న అద్భుతమగు చరిత్రను సృష్టించి, తన ప్రభువగు శ్రీరామునియొక్క శ్రేష్ఠమగు అంగుళీయకమును సీతాదేవికి ప్రీతితో గుర్తుగా నొసంగెను (19). వీరుడగు ఆ కపీశ్వరుడు రాముని వృత్తాంతమును వినిపించి ఆమె ప్రాణములను కాపాడెను. ఆమె వెంటనే దుఃఖము విడనాడెను (20). ఆతడు ఆమెనుండి గుర్తుగా చూడామణిని తీసుకొని అనేక మంది రాక్షసులను సంహరించి, రావణుని ఉద్యాన వనమును ధ్వంసము చేసి, రాముని సన్నిధికి తిరిగి వచ్చెను (21). అదే సమయములో రావణుని కుమారుడగు అక్షయ కుమారుని

చాలమంది రాక్షసులతో సహా సంహరించి అచట నిర్భయముగా గొప్ప లీలలను ప్రకటించి ఆయన గొప్ప ఉపద్రవమును సృష్టించెను (22). ఓ మునీ! రావణుడు ఆయన తోకకు నూనెలో ముంచిన గుడ్డలను చుట్టించి నిప్పు ముట్టించెను. కాని మహాబలశాలియగు ఆ హనుమంతుడు వారి బారినుండి తప్పించుకొని (23) ఒక భవనము నుండి మరియొక భవనముపైకి దుముక జొచ్చెను. మహాదేవుని అంశవలన జన్మించిన ఆ వానరుడు అదే మిషతో లంకానగరమునంతనూ దహించెను (24).

దగ్ధ్వా లంకాం వంచయిత్వా విభీషణ గృహం తతః | అపతద్వారిధౌ వీర స్తతస్స కపికుంజరః || 25

స్వపుచ్ఛం తత్ర నిర్వాప్య ప్రాప తస్య పరం తటమ్ | అఖిన్న స్సయ్ ॰ రామసన్నిధిం గిరిశాంశజః || 26

అవిలంబేన సుజవో హనుమాన్ కపిసత్తమః | రామోపకంఠమాగత్య దదౌ సీతా శిరోమణిమ్ || 27

తతస్తదాజ్ఞయా వీరస్సింధౌ సేతుమబంధయత్| వానరైస్స సమానీయ బహూన్ గిరివరాన్ బలీ || 28

గత్వా తత్ర తతో రామస్తర్తు కామో యథా తతః | శివలింగం సమానర్చ ప్రతిష్ఠాప్య జయేప్సయా || 29

తద్వరాత్స జయం ప్రాప్య వరం తీర్త్వోదధిం తతః | లంకామావృత్య కపిభీ రణం చక్రే స రాక్షసైః || 30

జఘానాథాసురాన్ వీరో రామసైన్యం రరక్ష సః | శక్తి క్షతం లక్ష్మణం చ సంజీవిన్యా హ్య జీవయత్ || 31

సర్వథా సుఖినం చక్రే సరామం లక్ష్మణం హి సః | సర్వసైన్యం రరక్షాసౌ మహాదేవాత్మజః ప్రభుః || 32

రావణం పరివారాఢ్యం నాశయామాస విశ్రమః | సుఖీచకార దేవాన్ స మహాబలగృహః కపిః || 33

వీరుడగు ఆ కపిశ్రేష్ఠుడు అపుడు విభీషణుని ఇట్లు తక్క మిగిలిన లంకను దహించి, తరువాత సముద్రములో చేరి (25), తన తోకయందలి నిప్పును చల్లార్చుకొని ఆవలి తీరమును చేరుకొనెను. శివుని అంశతో జన్మించిన ఆ వీరుడు ఉత్సాహముతో రాముని సన్నిధికి చేరెను (26). మహావేగము గలవాడు, వానరవీరుడు అగు హనుమంతుడు విలంబము లేకుండగా రాముని సన్నిధికి వచ్చి సీతాదేవి యొక్క చూడామణిని ఇచ్చెను (27). అపుడా వీరుడు ఆయన ఆజ్ఞను గైకొని వానరులతో గూడి అనేక పెద్ద పర్వతములను దెచ్చి సముద్రమునందు సేతువును నిర్మించెను (28). అపుడు శ్రీరాముడు అచటకు వెళ్లి సముద్రమును దాటగోరెను. ఆయన అపుడు ఆ గొప్ప సముద్రమును దాటి వానరులతో గూడి లంకను చుట్టు ముట్టి రాక్షసులతో యుద్ధమును చేసెను (30). అపుడా వీరుడు రాక్షసులను సంహరించి రాముని సైన్యమును రక్షించెను. శక్తిచే కొట్టబడి నేలగూలిన లక్ష్మణుని సంజీవినితో బ్రతికింప జేసెను (31). మహాదేవుని పుత్రుడగు ఆ హనుమత్ర్పభుడు రామలక్ష్మణులకు సర్వ విధములుగా సుఖమును కలిగించి సైన్యము నంతనూ రక్షించెను (32). శ్రమను ఎరుంగని వాడు, మహాబలసంపన్నమగు దేహము గలవాడు అగు ఆ హనుమంతుడు సకుటుంబముగా రావణుని వశింపజేసి దేవతలకు మోదమును గూర్చెను (33).

మహీరావణ సంజ్ఞం స హత్వా రామం సలక్ష్మణమ్ |
తత్స్థానాదానయామాస స్వస్థానం పరిపాల్య చ || 34

రామకార్యం చకారాశు సర్వథా కపిపుంగవః | అసురాన్నమయామాస నానాలీలాం చకార చ || 35

స్థాపయామాస భూలోకే రామభక్తిం కపీశ్వరః | స్వయం భక్తవరో భూత్వా సీతారామసుఖప్రదః || 36

లక్ష్మణప్రాణదాతా చ సర్వదేవముదావహః | రుద్రావతారో భగవాన్ భక్తోద్ధారకరస్స వై || 37

హనుమాన్ స మహావీరో రామకార్యకరస్సదా | రామదూతాభిధో లోకే దైత్యఘ్నో భక్తవత్సలః || 38

ఇతి తే కథితం తాత హనుమచ్చరితం వరమ్ | ధన్యం యశస్యమాయుష్యం సర్వకామ ఫలప్రదమ్ || 39

య ఇదం శృణుయాద్భక్త్యా శ్రావయేద్వా సమాహితః | స భుక్త్వేహాఖిలాన్ కామానంతే మోక్షం లభేత్పరమ్ || 40

ఇతి శ్రీ శివమహాపురాణ  శతరుద్ర సంహితాయాం హనుమదవతార వర్ణనం నామ వింశోధ్యాయః (20)

హనుమంతుడు మహీరావణుడను రాక్షసుని సంహరించి వాని వద్ద బందీలుగానున్న రామలక్ష్మణులను రక్షించి తీసుకొని వచ్చెను (34). ఆ వానరవీరుడు సర్వవిధములుగా రామకార్యమును చేయుచూ రాక్షసులను నిర్జించి వివిధలీలలను ప్రకటించెను (35). ఆ కపివీరుడు తాను గొప్ప భక్తుడై సీతారాములకు సుఖమును కలిగించి భూలోకములో రామభక్తిని సుస్థిరము చేసెను (36). రుద్ర భగవానుడు ఈ విధముగా అవతరించి లక్ష్మణుని ప్రాణములను కాపాడి, దేవతలందరికీ ఆనందమును కలిగించి, భక్తుల నుద్ధరించెను (37). మహావీరుడు, సర్వదా రామకార్యమును చేసినవాడు, రాక్షససంహారి మరియు భక్తప్రియుడు నగు ఆ హనుమంతుడు రామదూతయను ప్రఖ్యాతిని గాంచెను (38). వత్సా! నీకీ తీరున శ్రేష్ఠమైనది, ధన్యమైనది, యశస్సును ఆయుర్దాయమును ఇచ్చునది మరియు కోర్కెలనన్నిటినీ ఈడేర్చునది యగు హనుమచ్చరిత్రను చెప్పితిని (39). ఎవడైతే దీనిని భక్తితో మనస్సును లగ్నము చేసి వినునో, లేక వినిపించునో వాడు ఇహలోకములో సమస్తభోగముల ననుభవించి మరణించిన తరువాత సర్వశ్రేష్ఠమగు మోక్షమును పొందును (40).

శ్రీ శివమహాపురాణములో శతరుద్ర సంహితయందు హనుమదవతారవర్ణనమనే ఇరువదియవ అధ్యాయము ముగిసినది (20).